# కృతిసమర్పణ శీర్ష రత్నములు

•••○○•••

సీ. సర్వసర్వంసహా ధూర్వహాత్తేజిత
తేజుఁ డే పద్మకోద్దీపకుండు
భారతసామ్రాజ్య శూరసేనాని యం
చెలఁగు నేఘను "కే. సి. ఐ. ఇ" బిరుద
మానరబుల్ బిరుదాన సార్థకముగా
మన్నింతు రాంగ్లసమ్రాట్టు లెవనిఁ
చెన్నపురీరాష్ట్ర సింహాసనాధ్యక్షు
సచివాగ్రగణ్యుఁ డేశక్తిశాలి
ప్రథితాంధ్రవిశ్వకళా పరిషత్తు ప్రో
ఛాన్సల రేభూపసత్తముండు
వైరిగోవృషభాల పాలింటి బెబ్బులి
బొబ్బిలి నేలు నే భూతలేంద్రుఁ

తే-గీ. డట్టి-సర్-రాజ-రావు శ్వేతాచలపతి
రామకృష్ణరంగారావు రాజచంద్ర
మహామహాప్రభు శేఖరు నోముఁగాతఁ
ప్రీతి శ్వేతాద్రిపతి రామకృష్ణ విభులు.

(శీర్షము = సీసము.
పద్మక = పద్మము,
పద్మక వంశము.)

సీ. కవిసార్వభౌముండు గణుతింపఁగాఁదగు
సాహిత్యసామ్రాజ్యచక్రవర్తి
రావుసర్వజ్ఞ సింగావనీకాంతుండు
పార్థివాగ్రణి మీఁదు వంశకర్త
కారుణ్య మిత్రతా వీరతా ప్రభుతలఁ
దనియించి రంగవాకను జయించి
మెహరుబాన్. దోస్తాన. బహదరు. సాహెబు
రంగరా వాది కోత్తుంగవంశ్య
బిరుదాల 'పాదుషా' గురుతఁ జూపఁగఁ గాంచు
పెదరాయ లింగప వేంకటేంద్ర

భువనేశు లవనీశ భవదీయ వంశంపు
ముక్తాఫలంబులై పొగడు గనిరి
వేలకువేలిచ్చె వేణుగోపాల సీ
తారామ దేవతాగారములకు
శాశ్వతస్థితిగ యౌష్మాకవృద్ధప్రపి
తామహ శ్వేతాద్రి ధరణి విభుఁడు
విద్యాప్రియుం డాంధ్రవిశ్వకళాపరి
ష ద్గౌరవాధ్యక్షు స త్తముండు
మీతాత వేంకట శ్వేతాచలేశ్వరుం
డాంధ్రగీర్వాణ వృద్ధ్యర్థమర్థి
లక్షరూప్యము లీయ రాజేంద్ర పరిషత్తు
ప్రచురించు నిట్టి సద్గ్రంథశతము
జనరంజనంబునం జనక వాక్పాలనం
బున రామదేవుఁ డన్ పొగడు గనిన
శ్రీ వేంకట కుమార కృష్ణ రంగారావు
జగతీశ్వరుండు మీ జనకుఁ డీశ
సర్వవిధంబులం బూర్వరాజాతిగ
లోకోత్తర గుణోత్తరుండ వౌచు
శౌర్యధైర్యౌదార్య వీర్యగాంభీర్య సు
స్థైర్య ధీరోదాత్త చర్యుఁడౌచు
నుత్తరోత్తరవృద్ధి * నుదిత ముదితముగాఁ
గుల ముద్ధరించు సద్గుణుఁడ వౌచు
నసహాయశూరత కద నిది గాదంచుఁ
బెనఁగు జస్టిసుపార్టి విభుఁడ వౌచు
నాంగ్లేయ సార్వభౌ మానుకూల్యంబున
రాజభక్తికిని దార్కాణ వౌచు
దీనాసమర్థ ప్రజానురంజనముగాఁ
బాలించు రాజతా శాలివౌచుఁ

* "ఇదం వో యాజ్ఞ్యానా ముదిత ముదితం యత్కుల మభూత్"
(అనర్ఘరాఘవము, ౧ అంకము.)

# విజ్ఞప్తి

విచక్షణులారా, ఆంధ్రశబ్దచింతామణి నన్నయభట్టారక విరచితమనియు నయ్యది యాంధ్రవ్యాకరణప్రపంచమునఁ బ్రాథమిక మగుటంజేసి సంస్కృతసమ శబ్దానుశాసనము ప్రధానముగను నచ్ఛాంధ్రభాషానుశాసన మప్రధానముగను రచింపఁబడినదనియు నద్దానియందలి పరిశిష్టవిషయములను విపులముగఁ బూరించుటకయి యథర్వణాచార్యునిచే వికృతి వివేక మనెడి యథర్వణకారికావళి రచింపఁబడినదనియు నా రచించియున్న చింతామణి విషయపరిశోధనమున విపులవిమర్శన పురస్సరముగ సిద్ధాంతీకరించియున్నాను. అట్టి నన్నయాథర్వణ గ్రంథములను జోడించి యావశ్యకతనుబట్టి యితరలక్షణ గ్రంథభాగములను నా రచించిన కారికలను నచ్చటచ్చటఁ జేర్చిన నన్నయాథర్వణీయ మనెడి మహాకవిప్రయోగమూల కాంధ్ర భాషాస్వరూప నిరూపక మగు గ్రంథమును మూలముగఁగొని యద్దాని కితరాంధ్రలక్షణగ్రంథ ప్రపంచపరిశీలన పూర్వకముగను, వైదిక లౌకిక సంస్కృతభాషా వ్యాకరణ సంబంధ పరిశీలనపూర్వకముగను, బ్రాచీన మహాకవిప్రయోగ ప్రపంచ ప్రదర్శనపరిశీలన పూర్వకముగను, నితర ద్రావిడభాషాసంబంధ విశేష విమర్శనార్థక తొల్కాప్పియ కర్ణాటభాషాభూషణాది ద్రావిడవ్యాకరణ విషయ ప్రదర్శన పరిశీలన పూర్వకముగను, విపులమగు వ్యాఖ్యానముచేయుటయే మదీయ పరమోద్దేశము. ఆంధ్రభాషా వాఙ్మయ కూలంకష పాండిత్య సంపత్తికి "శాస్త్ర మపౌరుష మాద్యం । ప్రాయికనిత్యప్రయోగలక్ష్యైతత్ । దృశ్య" మిత్యాది నన్నయభట్టారక సూక్తిచొప్పున వ్యాకరణ సంస్కార సంస్కృత సంస్కృతభాషావాఙ్మయ పరిజ్ఞానమేకాక యితర ద్రావిడభాషా వైదుష్యమును నత్యావశ్యకమనుటలో విప్రతిపత్తిలేదు.

గ్రాంథికాంధ్రభాషాస్వరూప నిరూపణవిషయమునఁ గథావస్తునిర్వహణ పరతంత్ర ప్రాచీనమహాకవి గ్రంథములలోని కవిప్రయుక్తములె యని విశ్వసింపఁదగిన సాధారణముగా మార్పరాని స్థలములందలి ప్రయోగ విశేషములతోపాటుగఁ బ్రాచీనగ్రాంథికాంధ్ర భాషానుశాసనైకతానములగు నాంధ్రశబ్దచింతామణి వికృతి వివేకాది ప్రాచీనలక్షణ గ్రంథములును బ్రాచీనమహాకవికృతములె యగుటంజేసి పరమ ప్రామాణికము లనుట నిర్వివాదాంశము. కాన, నట్టిదానికి వ్యాఖ్యానముచేయుట ప్రాచీన గ్రాంథికాంధ్ర

భాషాసేవకుల కత్యంతోపకారకమును వ్యాఖ్యాకర్తకు ధన్యతాపాదకమును నై యుండు ననుటలో సందియము లేదు.

ఇప్పటికి వెలయించిన యీ యాఱుప్రకరణములలోను దద్భవప్రకరణమును ననుస్వారప్రకరణమును నక్షర ప్రకరణమును నంతస్థప్రకరణములోని రేఫ ఱకారవిషయమును మిక్కిలిగ విపులీకరింపఁబడినవి.

ఆంధ్రభాషలో వైకృతశబ్దముల తెగయు మిక్కిలి విశాలమైనదియె. కాన, సంస్కృత శబ్దప్రపంచము వికృతినందిన పద్ధతులను నట్టి వికృతులు కల్గుటలోని శబ్ద తత్త్వశాస్త్రసిద్ధములగు నుపపత్తులను లఘువుగానైన దెలిసికొనుట యత్యావశ్యకమై యున్నది. అందు వికృతులు కల్గుజాడలు మాత్రమలంతిగ నర్వాచీనమగు కవిసంశయ విచ్ఛేదమున వివరింపఁబడి యున్నవి.

వర్ణోచ్చారణశుద్ధి, వర్ణవైశేష్యనిర్ణయము, వికృతిశబ్దావిర్భావములోని భాషా పరిణామోపపత్తిజ్ఞానము, మున్ముందటి సంధిప్రభృతి వ్యాకరణ కార్యసాధన ప్రక్రియోపపత్తిజ్ఞానము, మున్నగు ననేక భాషాశాస్త్రవిషయముల కక్షర తత్త్వశాస్త్రము మూలభూతమైయున్నది. అట్టి విషయ మాంధ్ర వ్యాకరణాభ్యాసకులకేకాక లౌకిక సంస్కృత వ్యాకరణాభ్యాసకులకు నైతము విస్తరించి యుపదేశించు సంప్రదాయమె లేదు. అట్టి శాస్త్రము నుపపాదించు గ్రంథ మాంధ్రవాఙ్మయమున నిప్పటికిని వెలసియుండలేదు. వైదిక సంస్కృత వ్యాకరణములలో మాత్రమె యట్టి శాస్త్రము విస్తరిల్లియున్నది.

అనుస్వార చరిత్ర మింకను వింతదశలో నున్నది. హ్రాస్వముమీఁది యర్ధానుస్వారమునుండి పూర్ణానుస్వారమును జింతామణి సాధించుచున్నట్లహోబలపతి వ్యాఖ్యచేసియున్నాఁడు. నన్నయ భట్టారకునకు ముందు నైతమర్ధానుస్వారము పూర్ణానుస్వారరూపముగనో యనునాసికరూపముగనో లిఖింపఁబడెడిదని కొందఱు విమర్శకులు వ్రాయుచున్నారు. అరసున్న కర్థచంద్రాకార లిపి నాధునిక ముద్రణకర్తలు కల్పించిరని కొందఱు తలంచుచున్నారు.

ఇంక రేఫ ఱకారవిషయకములగు నథర్వణకారికల యర్థమె దుర్జ్ఞేయమై యున్నది. వీనికి వింతవింతలగు విపరీతార్థములను గొందఱు పండితులు చేసియున్నారు.

పయి కారణములచేతఁ దత్తద్విషయములను గొంత విస్తృతమగు విమర్శనముతో వ్రాయవలసివచ్చెను. ఉచ్చారణ భ్రష్టములగు నర్ధానుస్వార

శకటరేఫముల విషయమున నింతవిరివిగ వ్రాయనేలయని తలంపరాదు. ప్రాచీన గ్రాంథికాంధ్రభాషా విషయమున వాని పరిశోధన మత్యావశ్యకమనియు నేఁటికిని ప్రామాణిక గ్రాంథికాంధ్రభాషా లేఖన ముద్రణాదులలో నయ్యవి పట్టుదలతోఁ బాటింపఁబడుచునే యున్నవనియుఁ బాఠకమహాశయులు గ్రహింతురుగాక.

పఱిగన్నడము తమిఱము మున్నగు నన్యదేశ్య శబ్దములలో వెలయుచున్న ఱకారపు లిపి ‘ఴ’ అనురీతిని దమిఱమునందును ‘ఱ’ అను రీతిని ప్రాచీనాంధ్రకర్ణాట సాధారణ లిపియందును నుండుటంజేసి, యట్టి శబ్దముల నుపయోగించినపుడు డా యాంధ్రకర్ణాట సాధారణలిపి యిం దుపయోగింపఁబడుచు వచ్చెను. నన్నయభట్టారకుని నాఁటి కట్టివర్ణము తెల్గున, డకారాదిరూపముగఁ బరిణమించి యుండుటంజేసి, యది యిందలి యచ్చాంధ్రవర్ణసమామ్నాయమున గ్రహింపఁబడదయ్యెను.

ఆంధ్రశబ్దచింతామణి కీవఱకుఁ బుట్టియున్న వ్యాఖ్యలలో విపులమయియున్న సంస్కృతభాషామయమగు కవిశిరోభూషణమును రచించిన యాతని పేరు పురాణగాథల చొప్పున “అహోబిలుఁడు” అని చెప్పఁదగియున్నను నీవఱకున్న లిఖితముద్రిత గ్రంథములందెల్ల “అహోబలపండితుఁడు, అహోబల పండితీయము” అని యిట్లు వెలసియుండుటంజేసి సంజ్ఞావిషయమున నట్లు పేర్కొన్నను క్షతిలేదన్న తలంపున నట్టి పేరులిందు మార్పలేదు. (చూడుఁడు- ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము, అహోబలశబ్దము.) మఱియు నహోబల శబ్దభవమగు తద్భవరూపము “ఓబల, ఔబల, ఓబ, ఓబమ్మ” అను రీతిని గ్రంథములలో వెలయుచుండుటంజేసి ప్రాచీన పండిత వ్యవహారమునందును ‘అహోబల’ అను వ్యవహారమె యుండెడిదని విశదమగుచున్నది. “ఓబామ్బికాయాం నరసక్షితీన్ద్రాత్” (సదాశివదేవరాయల దానశాసనము ఎపిగ్రాఫియా ఇండికా, ౪ పుస్తకము, ౧ పుట.)

నేను శ్రీ విజయనగర మహారాజులవారి సంస్కృతకళాశాలయందాంధ్ర ప్రధానోపాధ్యాయుఁడుగ నున్నపుడె నన్నయాథర్వణ గ్రంథములను జోడించి యద్దాని వ్యాఖ్య రచనమునకుఁ దగు సామాగ్రిని సమకూర్చుకొనుచుండెడివాఁడను. అట్లాంధ్రభాషా వాఙ్మయ పరిశోధనముచేయు సందర్భమున నావఱకు రచించియున్న వసుచరిత్రవిమర్శన హరిశ్చంద్రలోపాఖ్యాన విమర్శనములకుఁ దోడుగ నథర్వణకారికావళీ విమర్శనమును సంతరించి, బాలసరస్వతీయ విమర్శన చింతామణివిషయ పరిశోధనముల రచనమునకుఁ గడంగితిని. ఇంతలో నేను చెన్నపురి విశ్వవిద్యాలయాంధ్రభాషా వాఙ్మయ పరి

శోధక సభ్యుఁడుగ నియమింపఁబడుటచేత దీర్ఘపరిశోధనము చేయుచు, నట్టి గ్రంథముల రచనమును గొనసాగించుట కవకాశము గల్గెను. కాఁగా, నచట నున్న మూఁడేండ్లలో నారచింపఁబూనియున్న నన్నయాథర్వణీయ వ్యాఖ్యానమగు వైయాకరణ పారిజాతమనెడి యీ గ్రంథ మాఱుప్రకరణములుగ రచించితిని. నేను దీనిని ముద్రింపించుకొని దీని సామ్యము ననుభవించుట కుదారహృదయులగు శ్రీమద్రాసు విశ్వవిద్యాలయమునా రనుగ్రహించిరి. పిదప నేను శ్రీయాంధ్రవిశ్వకళాపరిషత్కళాశాలయం దాంధ్రోపాధ్యాయుఁడుగ నియమింపఁబడి యపు డాంధ్రవిశ్వకళాపరిష దుపాధ్యక్షులగుచు యున్న శ్రీ ప్రొఫెసర్, సర్, సర్వేపల్లి రాధాకృష్ణ పండిత, కె. టి; యమ్. ఎ; డీ. లిట్; వారితో నే తద్గ్రంథవిషయమును బ్రసంగించి ముద్రణరూపమున దీని వెలయింపవేఁడఁగా నమ్మహాశయు లాంధ్రవిశ్వకళాపరిషత్తువారి ప్రచురణములలో నొకటిగా నా యీ గ్రంథ మురిడున ట్లేర్పాటుచేయ, శ్రీ సిండికెటువా రద్దానిని నామోదించి నాభాషాసేవకుఁ బ్రోత్సాహ మొసంగిరి. తరువాత, నాంధ్రవిశ్వకళాపరిష దుపాధ్యక్షపదవి నధిరోహించిన పండితవిమర్శకాగ్రసరులగు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి యమ్. ఎ; (Cantab) యమ్. ఎల్. సి; వా రట్లారంభింపఁబడిన యేతద్గ్రంథ ముద్రణమును బూర్ణము గావింపించి, దీనిని వెలయింపఁజేసిరి. పై రీతి నేతద్గ్రంథవ్యాప్తికి మూలభూతులగు ప్రభుమహాశయులందఱయెడలను, నే నత్యంత కృతజ్ఞుఁడ నగుచున్నాను.

ఈ గ్రంథమందలి తమిళ మళయాళభాషావిషయముల పరిశీలనమునకు వలయు తత్తద్వ్యాకరణాది గ్రంథసారములను నాకుఁ దెలిపిన తమిళాంధ్రకర్ణాటమలయాళ భాషావిశారదులగు విద్వాన్, వి. వేంకటరాజులు రెడ్డిగారి యెడలను (మద్రాసు విశ్వవిద్యాలయమువారి తమిళ భాషావాఙ్మయ పరిశోధకసభ్యులు) కర్ణాటభాషావ్యాకరణాది విషయములను దెలిపిన సంస్కృత కర్ణాట భాషా పాండిత్య పరిపూర్ణులగు శ్రీమాన్, హెచ్. శేషయ్యంగారు, ఆచార్యులుగారి యెడలను (మద్రాసు విశ్వ విద్యాలయమువారి కర్ణాట భాషా వాఙ్మయ పరిశోధక సభ్యులు) నే నత్యంత కృతజ్ఞుఁడ నగుచున్నాను.

పాఠక మహాశయులు సావధానముగ నా యీ గ్రంథమును జిత్తగించి యిందలి గుణలేశములను మన్నించి స్వభావ సులభమగు సమ్మోదము నందుదురు గాక.

విశాఖపట్టణము
6—11—1936.

ఇట్లు గ్రంథకర్త:
ధర్భల చినసీతారామస్వామి శాస్త్రి.

# విజ్ఞప్తియనుబంధము



నా రచించిన యీ వైయాకరణ పారిజాతము మున్నగు గ్రంథములలోని నా సిద్ధాంతములకు భిన్నాభిప్రాయులగుచు, వలంతి విజ్ఞు లేమేమో వ్రాసియున్నారు. వారు నాగ్రంథములను సరిగాఁ జదివినట్లు కానుపింపదు. సంస్కృతమెంత ‘అగ్గబుయ్య’ యయ్యెనో కాని మా గృహనామమగు ‘వఝులవారు’ అనుదానిని ‘వఝ్ఝులవారు’ అని వ్రాయునంతటి విజ్ఞులైరని చెప్పుటకుఁ జింతిల్లుచున్నాను. వర్గయుక్కులు ద్విరుక్తములగు నపుడు వానిలో మొదటిది యల్పప్రాణమగుట యుచ్చారణ స్వభావసిద్ధమును శాస్త్రసిద్ధమును నని గ్రహింప లేకుండుట వింత!

“ఈవిషయమై 25—6—53 తేదీని శ్రీ వఝ్ఝులవారికి లేఖవ్రాయఁగా సమాధానము లభింపమింజేసి కాఁబోలు మిన్నకుండిరి” (ఆంధ్రభాషాభూషణపత్రిక 68 పుట)” (నా జవాబీయమికిఁ గారణమును సరిగా నరయమి శోచనీయము.)

“శాస్త్రప్రపూర్ణ శ్రీయుత వఝ్ఝుల చినసీతారామస్వామిశాస్త్రిగారివంటి యుద్దండ పండితశిఖామణిని సైతము ఓటమిం జెందించిన” (ఆంధ్రభాషాభూషణము ‘తొలిపలుకు-౮ పుట).

ఇట్టి వ్రాఁతలను జూచియే కావలయు గుండప్రజలో నొకరు “గ్రాంథిక వాదాన్ని తిరుగులేకుండా దెబ్బకొట్టినారు” అని వ్రాసిరి. (ఆంధ్రపత్రిక ౧౯౫౬—జనవరి ౭ తేదీ—౭ పుట)

ప్రతిపక్షులు నా యీ యనుబంధమునైనఁ జదువఁగల్గుదు రేమోయని యాశించుచు నీవఱకు విపులవిమర్శన పూర్వకముగా వ్రాసియున్న నాగ్రంథములలోని విషయములనె తీసి యీ యనుబంధముం బ్రచురించుచున్నాను.

ముఖ్యముగా “ఆంధ్రశబ్ద చింతామణి” మహాభారత భాగాంధ్రీకర్తయగు నన్నయచే రచింపఁబడలేదనియు నద్దానిని బాలసరస్వతి రచించియుండుననియు నట్లే వికృతి వివేకమనెడి యథర్వణకారికావళి యాచింతామణికి వివరణ గ్రంథము కాదనియు దాని నహోబల పండితుఁడు రచించి యుండుననియు కీ. శే. శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులవారు మొట్టమొదటఁ దమ యాంధ్రకవుల చరిత్రలో వ్రాసిరి. ఈవిషయమును నా రచించిన చింతామణి విషయపరిశోధనములోను నీ వైయాకరణ పారిజాతములోను ‘ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము’లోను విపుల విమర్శన పూర్వకముగా నేను నిరసించి యున్నాను. పిదప నట్టి ఖండిత యుక్తులనె చాలవఱకుఁ జూపుచు మఱికొంత నిస్సారగ్రంథమును జేర్చి యాంధ్రకవితరంగిణీకర్తగారు వ్రాసిరి. వీరు నాగ్రంథములను పూర్తిగాఁ జదివికొనకయె వ్రాసినట్లు కానిపించును. పిదప వీరి మిత్రులగు నాంధ్రభాషాభూషణపత్రికా కర్తగారు పయిగ్రంథమునె యుదాహరించుచుఁ గొంత వ్రాసిరి. ఇట్టి ప్రతిపక్షుల కందఱకును నాగ్రంథములను దయతో సావధానముగా నవగాహనముఁ జేసికొనుఁ డనునదే సరియగు సమాధానమనవచ్చును.

శ్రీ నిడుదవోలు వేంకటరావుపంతులు, (య. మ్మె.) గారు తమ ‘తెనుఁగుకవుల చరిత్ర’లో నీక్రిందిరీతిని వ్రాసిరి. “అథర్వణాచార్యుఁడు........ఇతని వ్యాకరణము వికృతి వివేకమను పేరు గలది; ఇందలి లిపి శ్లోకములలో నుదాహరింపఁబడిన యక్షర విన్యాస[illegible]

డా. బర్నెలుదొర (Dr. Burnell) వారీతనిని పంద్రెండవ శతాబ్దినున్నవాఁడని భావించిరి. ఇది సమంజసమె. నన్నయభట్టారకుని వెనుక తిక్కనకు ముందుగా భారతమును పూరించుటకుఁ బూనుకొనిన యాంధ్రకవి యథర్వణుఁడు." (తెనుఁగు కవుల చరిత్ర.-303 పుట). కాని యాంధ్రశబ్దచింతామణి నన్నయ రచితము కాదని నొక్కి వ్రాసిరి. అథర్వణుఁడు నన్నయ తిక్కనల మధ్యవాఁడనియు వికృతివివేక మను నథర్వణ కారికావళి నాయథర్వణుఁడే రచించె ననియు నంగీకరించునపుడింక నట్టి యథర్వణ కారికావళి యాంధ్రశబ్దచింతామణికి వివరణ గ్రంథమనియు నక్కారణమున నది భారతకర్తృ నన్నయ రచితమనియు నంగీకరింపక తప్పదు.

శ్రీ వేంకటరావుపంతులుగా రథర్వణ కారికావళికి నందలి లిపిశ్లోకములకు నర్థమును దెలిసికొని యుండమింజేసి వీరట్లు వ్రాసి రనుటకు సందియములేదు. గ్రంథములను జదువకయు వానియర్థమును సరిగ గ్రహింపకయు విమర్శనములు వ్రాయు నలవాటు విస్తరిల్లుచుండుట నిట్టి ముప్పు సంభవింపవలసెను.

ఆంధ్రశబ్ద చింతామణి "దరశార్ఙ్గ పిప్పల దళాఙ్కుశ పన్నగ సన్నిభాః క్రమాత్పరుషాః" అని యాకాలపు శాసనములలోఁ బ్రసిద్ధమైయున్న యాంధ్ర కర్ణాట సాధారణ లిపిలోని పరుషముల యాకారమును వర్ణింపఁగా దానినే యనువదించుచున్న "పఞ్చ వర్గాద్యా వర్ణాః శృఙ్గ శార్ఙ్గాది సన్నిభాః" అను నథర్వణ కారిక వచింపఁబడినదని గ్రహింపకుండుట శోచనీయము!

నన్నయ నాఁటికి శాసనాది ప్రసిద్ధమగు నాంధ్రకర్ణాటసాధారణ లిపిని గొంత శాస్త్రవముగ నుండునట్లు నన్నయ సవరింపఁగా నద్దాని నథర్వణుఁడు మఱింత యుక్తముగా సంస్కరించెను. అట్టి నన్నయాథర్వణోపదిష్టలిపి సంస్కారము ప్రాతిశాఖ్యప్రసిద్ధ వర్ణోత్పత్తి పద్ధతి ననుసరించి యున్నది. అట్లయినను నలవాటు బలిమిచేత నయ్యది వాడుక తక్కువయ్యెను. కాని యందలి కొన్నివిషయములు మాత్రము వాడుకలోనికి వచ్చినవి.

నన్నయనాఁటికిఁ దలకట్టు '—' అనురీతి నుండఁగా 'అ' కార లిపికి (తలకట్టు) సరిగా బాలచంద్రాకార (✓) లిపి నన్నయచే నుపదేశింపఁబడెను. ప్రాచీన లిపిలోఁ బొల్లు హల్లును వ్రాయునపుడు దానితలమీఁది 'అ' కారపు గుఱుతగు '—' అనురేఖను వ్రాయ మానుటయే యై యుండఁగా నథర్వణుఁడు '/=' పొల్లునకుఁ దిర్యగ్రేఖను నిల్పవలయునని యుపదేశించెను. (తిర్యగ్రేఖా యుజ శ్చోర్ధ్వమ్) ఆపొల్లుగుఱుతు తర్వాతి లిపిలో విస్తరించెను. అట్లే వర్గయుక్కులు ప్రాచీనలిపిలో 'ఒత్తులు' లేకయే యుండఁగా నథర్వణోపదిష్టమగు నథోదండ రేఖ తర్వాతి లిపిలో (దణ్డరేఖాస్వ్వధో ఽథః) విస్తరిల్లినది. అట్లె ప్రాచీనలిపిలో లేని మిళద్దండ ద్వయరేఖ (జ – ఝ) (మిళద్దణ్డ ద్వయోపేతౌ) 'జ – ఝ' ల లిపిలో విస్తరిల్లినది. నన్నయాథర్వణలిపి ప్రాతిశాఖ్య ప్రసిద్ధ వర్ణోత్పత్తి పద్ధతి మూలకము. (చూ – వై. పా. ౨౩౨ విష. ౨౬౦ పుట) (౨౩ మొ – ౨౭౧ – విష. వై – పా – ౨౬౧ – ౨౬౫ పుటలు). (ఈలిపిశ్లోకము లాంధ్ర భాషా చరిత్ర కర్తగారి కేవో గీఁతలని యర్థమైనవి).

ఆంధ్ర కవితరంగిణీకర్తగారగు శ్రీ చాగంటి శేషయ్యగారును నాంధ్రభాషాభూషణ పీఠికా కర్తగారగు శ్రీ వఙ్గమూడి గోపాలకృష్ణయ్యగారును మఱొక వింత సిద్ధాంతము నంగీక

రించిరి. "అప్పకవి స్వతంత్రముగా రచించిన పద్యములను నహోబిలుఁడు, కారికలుగ సంస్కృతీకరించి యథర్వణుని పేరు పెట్టినాఁడు" (ఆంధ్ర - తరం - ౩ సం పు|| ౭౩-౭౪ పుటలు.) (ఆంధ్రభాషాభూషణ పీఠిక. ౩౨ పుట). అథర్వణకారికలకు సమానార్థకములగు పద్యము లప్పకవీయమున నలుగురు మాత్ర మున్నవి. ఆవిమాత్ర మథర్వణ కారికలకు మూలమనియుఁ దక్కిన యథర్వణ కారికలు స్వతంత్రములె యనియు వీరు వచింతురు కాఁబోలు! మఱియు నప్పకవీయములోని లిపి వివరణ పద్యము లథర్వణ కారికలతో మాత్రమె సమానార్థకములని వీరనుకొనుచున్నారు. ప్రతిపక్షు లనుకొనునట్లుగ నొక్క యథర్వణ కారికలనే యప్పకవి యచట నాంధ్రీకరింపలేదు. చింతామణిలోని యార్యలను నాథర్వణములగు ననుష్టుభములను జోడించి యాంధ్రీకరించెను. ఇంకఁ బ్రతిపక్షులు బాలసరస్వతి చింతామణి యార్యలను నహోబిలుఁ డథర్వణ కారికలను గీర్వాణించి రనవలెను. లిపిశ్లోకముల యర్థము తెలియక బాలసరస్వతి యా లిపిశ్లోకములను తన టీకలోఁ జెప్పనే లేదు. అప్పకవి చింతామణి లిపిశ్లోకములను బాలసరస్వతీయా థర్వణ కారికలను జోడించి తెనిగించెను.

"బాలేన్దు సరిధిశ్చాగ్ని వర్గ సుతగ్రని ద్రాత్రపగశుననూః! ఆద్యాః - (ఆం. చిం.)
ఇవి యథర్వణ కారికలలోనివి కావే!

సీ. విరియు చంద్రునిమాడ్కి వెలయు సత్వను ......... ! నడిమికి గుడిఁ బెట్టి
పడుప నిత్తు ......... (అప్పక. ౨ ఆశ్వా.)

దరశార్ఙ్గ సిప్పలదళాఙ్కుశ పన్నగ సన్నిభాః క్రమాత్ పరుషాః.........(ఆం. చిం.)
ఇవి యథర్వణ కారికలు కావే!

సీ. శఙ్ఖ శార్ఙ్గ ద్విపాశన దళాఙ్కుశ పన్న; గాకృతుల ..................
(అప్ప. ౨ ఆశ్వా.)

అప్పకవి యివి యాంధ్రశబ్ద చింతామణిలోనివే యని వచించెను. వీని నప్పకవి స్వతంత్రముగా రచించుటేమి? అహోబిలుఁడు గీర్వాణించుటేమి! అథర్వణ కారికలందు వాల్లుల యాకారములను నవగతము విషయములు మాత్రము కలవనియు నప్పకవీయ పద్య మూలకము లనుట కేవల మసంగత మనియు వాల్లుల యాకారములో సైతము గ్రంథద్వయమునకును చాల భేదము లున్నవనియు వీరు గ్రహింపకుండుట వింత! "పఞ్చ వర్గాదయో వర్ణాః" అను నథర్వణ కారికల యెత్తుబడి యైన వీరికి స్మరణకుఁ దట్టకుండుట మఱియు వింత! లిపిశ్లోకముల యర్థమును సరిగా గ్రహింపలేని యప్పకవి పద్యములు 'మూలము - స్వతంత్రములు' ననుట తద్గ్రంథ పరిశీలన రాహిత్య కృతము.

అప్పకవీయమునందును నహోబిలపండితీయమునందును గల వివరణ రేఖలు లిపిశ్లోకములకు సరిగా నుండక యున్నచో లిఖితులవలె కేవలము నసంగతములై యున్నవి. శ్రీగిడుగువారిచే సంస్కరింపఁబడిన యప్పకవీయమునందును నసంగతముగానె వ్రాయఁబడినను "ఈ రూపములు సరియైనవి కావు. .........బర్నెలు వ్రాసిన సౌదిండియన్ పేలియోగ్రఫీని......... చూడవలెను." అని టిప్పణముగా వ్రాసిరి (తై. సా. ౨౭౫ - ౨౭౬ విష. ౨౪౧, ౨౪౨ మొ. పుటలు.)

ఈ లిపిశ్లోకములలోని "పూర్ణేన్దు సదృశః పూర్ణః। స్వర్ధ స్స్వర్ధేన్దు సన్నిభః" అనునది నన్నయోపదిష్టమగు "పూర్ణార్ధభేదతో ద్వివిధః" అను దాని కథర్వణుండు చేసిన వివరణము. దీని నప్పకవి పండితపరంపరాయాతముగా విని మీఁదివానినివలె నిర్వక్రరీతి స్వార్థీకరించి యుండును.

తే. గీ. సగము జాబిల్లి వలె వ్రాయ సగమునున్న।
నిండు జాబిల్లివలె వ్రాయ నిండుసున్న.

(అప్పక. ౨ఆ. 33)

ఇట్లు గ్రహింపక శ్రీ శేషయ్యగారును వీరియుత్తరులు శ్రీ గోపాలకృష్ణయ్యగారును గల రూపును విపరీతము చేసి వ్రాసిరి. అప్పకవి చూపుచున్న కర్ధచంద్రాకారపు లిపిని గల్పించినాఁడనియు నహోబలుఁడు వ్రాసిన గీర్వాణవచనము వ్రాసిరి. (ఆంధ్రభాషాభూషణ పీఠిక ౩-అ పుట). మీఁదుమిక్కిలి ప్రాచీనులు పూర్ణార్ధములు రెంటిని నిండుసున్నగానె వ్రాసెడివారని యుక్తికి యసత్యస్థితి సంగీకరించిరి.

"ఐనను విమర్శకధర్మమును వీడఁజాలక మచ్చునొకటి నిదర్శనముగఁ జూపుచున్నాను.

ప్రాచీనులు సున్నలు రెంటికిని నిండుసున్ననే వ్రాయుచుండువారు. మీఁదిహల్లు ద్విత్వయుక్తమగుచో సున్నయనియు, ద్విత్వయుక్తము కానిచో సున్న యరసున్నయనియు నెంచుచుండెడివారు" (ఆంధ్రభాషాభూషణ పీఠిక 33 పుట) అని పీఠికాకర్తగారు వ్రాసిరి. వీరుగాని వీరికి మార్గదర్శకులగు శ్రీ శేషయ్యగారుగాని వైయాకరణ పారిజాతములోని యనుస్వార ప్రకరణమును జిత్తగించియున్న యెడలఁ బైరీతిని వ్రాయ సాహసింపకుందురు! (చూ. వై. పా. అనుస్వారప్రకరణ ౩౦౫ విష. మొ. ౩౭౨ విష. వ. ౨౭౮ పుట మొదలు ౩౬౭ పుటవ) అందును ౩౧౬-౩౧౭ పుటలనైనఁ జిత్తగించియున్నచో "రెండుసున్నలను సున్నగానె ప్రాచీనులు వ్రాయుట, పరాక్షరద్విత్వముచే నిండుసున్నయని గ్రహించుట" అను పద్ధతి సవ్యమని గ్రహింతురు. ప్రాచీనకాలమునఁ దేల్చిపలుకు ఖండానుస్వారము పేక్షింపఁబడెడిదనియును నన్నయభట్టారకుఁడే యట్టి ఖండానుస్వారమును స్థాపించినవాఁడనియుఁ బ్రాచీన శాసన ప్రదర్శన పూర్వకముగా విపుల విమర్శన పురస్సరముగా నందుఁ జూపఁబడి యున్నది. (చూ. వై. పా. ౩౧౬-౩౧౭ పుటలు) నన్నయభట్టారకుని ఖండాఖండానుస్వారములు పూర్ణార్ధ బిందువులను వ్యవహారమునె, చింతామణికి వివరణగ్రంథకర్తయగు నథర్వణుఁడు "పూర్ణేన్దు సదృశః పూర్ణః। స్వర్ధ స్స్వర్ధేన్దు సన్నిభః" అని వివరించెననియు గ్రహింప నగును.

గ్రంథమును జదువకయె వాని యర్థమును సరిగా తెలిసికొనకయె వానిమీఁది విమర్శకమునకు దిగుట పరమ సాహసము!

పయిరీతిని లిపిశ్లోకము లప్పకవ్యాదుల పద్యముల సంస్కృతీకరణము లనువాదములు ధ్వస్తము కాఁగా నథర్వణకారికావళి యప్పకవికిని నాతనికిఁ బూర్వుఁడగు బాలసరస్వతికిని నాతనికిఁ బూర్వుఁడగు ముద్దరాజు రామనకును బూర్వ ముండెడిదని యంగీకరింపక తీరమింజేసి యది తిక్కన కించుకపూర్వుఁడగు నథర్వణునిదే యను శ్రీ నిడుదవోలు వెంకటరావు పంతులుగారి పక్షములోనికి రాక తప్పదు.

III "క్వచి త్ప్రత్యయ యోగే చ । తథాత్వ ముభిధీయతే" అను నథర్వణ కారికలోని "తథాత్వమ్" అనుశబ్దమున కాంధ్రశబ్ద చింతామణిలోని "షష్ఠీ గనే ద్వితీయా స్యాత్ ! తత్త్వ విషసంస్థితా సామ్యామ్" అను కారిక చెప్పిన "షష్ఠికి ద్వితీయాతుల్యత్వ" మనుకట్టుట" యర్థము. (చూ. వ్యా. సం. ౨౫౧I–౨౭౦–౨౭౯ విష.) (౧౧౬౫–౧౧౬౮–౧౫౯ పుటలు–వ్యా–సం.)

IV "అన్యత్రాపి భవేద్ద్విత్వం । క్వచిత్ సుకవిసమ్మతేః" అను నథర్వణ కారికలో "అన్యత్రాపి" అను దానికి "ప్రథమ లుగపి ద్వి ను లోపః" అను చింతామణి కారికలోని "ద్వి ను లోపః" అను వానియందే కాక యితర స్థలములందును ద్విత్వలోపము కల్గునని యర్థము. చూ–వ్యా–సం. ౨౧౦ IV విష. ౭౯–౨ పుట.)

V "నుర్మా యా సుజసో ర్వ్యక్తా । యుక్తావపి మతౌ నుమా" అను నథర్వణ కారిక (చూ. వికృతి వివేకము ౧౩౦ పుట.) "దేశ్యా దస్త్రి ద్వ్యష్మ చ్ఛ్రద్ధా" త్తను నది మొదలగు నాంధ్రశబ్ద చింతామణి శ్లోకములకు శేషపూరకమయి యున్నది. 'నీ – నా – తా' శబ్దముల విషయమునఁ జింతామణిలోఁ జెప్పఁబడని రూపములే యీ యథర్వణ కారికచేత నిరూపింపఁబడుచున్నవి. (చూ. వ్యా. సం. ౨౧౯ విష. ౭౭౩ పుట)

VI "రజ్ఞతి ప్రభృతీనాం । బిన్దో శ్చస్యాపి లా వృథా భవతేః" (చూ. 'వ్యా. సం' ౩౨౭ విష.) అని చింతామణి "రజిల్లు" నున్నగునట్లు లకార ద్వయ రూపమును సాధించి యుండఁగా నందొక 'ల' కారము లోపించుటయుఁ గలదని యథర్వణుఁడు "త త్రోభయో ర్భవే ద్దేకో । లకార ఇతి కేచన" అని వివరించి యున్నాఁడు. ఇందలి "తత్ర" అనుదానికిఁ జింతామణి సూత్రములోని "లావృథా" అనుదాని చెప్పిన వచ్చు లకార ద్వయములో ననియే కదా యర్థము.

ఇట్టి స్థలములు పెక్కుగలవు. విస్తరభీతిని జూపలేదు. ఇట్టి సందర్భములను బరిశీలించునపు డాంధ్ర శబ్దచింతామణికి వికృతి వివేకము వివరణ గ్రంథము కాదనుమాట (ఆంధ్ర కవి తరంగిణి – ౩ సం. ౭౯ – ౮౧ పుటలు) విమర్శన రాహిత్య కృతమని యెవ్వరికేని తోఁచక మానదు గదా. నన్నయాథర్వణ కారికల యర్థము నాఘ్రాణించినయెడ నున్నట్లో నట్లు వ్రాయ సాహసింపరు గదా.

అహోబలుఁడే యథర్వణ కారికల రచయిత కానోపునను ప్రతిపక్షుల వాక్యమును గేవలము నసత్య మనక తీరదు. అథర్వణ కారికలు పెక్కు కవిశిరోభూషణకర్తయగు నహోబలపతి కర్థము కాలేదు.

వెనుక నుదాహరించిన "క్వచి త్ప్రత్యయ యోగే చ । తథాత్వ ముభిధీయతే" అను నథర్వణ కారిక కర్థసందర్భములు తెలియక యహోబలపతి "ప్రత్యయ యోగే మిక్కిలియు నిత్యుదాహరణమ్" అని మిక్కిలి యసంగతముగా నుదాహరించెను. ఈ స్థలమునఁ బ్రత్యయ యోగ మేమియు లేదుగదా! (అహో. ౧౮౯ పుట. అనాదిష్వ్విత్యాది సూత్రవ్యాఖ్య)

అట్లె వెనుక నుదాహరించిన "తత్ర తృతీయా షష్ఠీ చ । విభక్తీ సమ్మతే ఉభే" (వ్యా. సం. ౨౩౨ విష.) అను నథర్వణ కారిక కర్మార్థకస్థల విషయకమని యహోబలపతి కేవలము ప్రామాదికముగా వ్రాసెను. (అహో. ౫౦౩ పుట.)

నన్నయాథర్వణ సమ్మతములగు ప్రుత స్వత్వ సంశ్లేషముల స్వరూప మహోబలపతి గ్రహింపలేదు. (చూ. 'వ్యా. సం.' ౮౦ విష. ౨౭౮ పుట మొ. ౨౮౧ పుట వ.)

ప్రాకృతే తద్భవే చాపి సజ్జా దన్త్య భవౌ స్మృతౌ" అను నథర్వణ కారికలోని ప్రాకృత శబ్ద మాంధ్రదేశ్య మగునని యహోబలపతి గ్రహింపలేదు. (చూ. 'వ్యా. సం.' విస్త ౧౮ విష.) దేశ్యమందే లేని దంత్యత్వము తద్భవములం దెట్లు ఘటిల్లును?

"స్త్రియశ్చ స్త్రీసమ స్త్వేతౌ ద్రుతః స్యా న్నిత్యశ్శ్రుతిః క్వచిత్" అను నథర్వణకారిక కపార్థము చేసికొని యీ క్రిందిరీతిని వ్రాసెను. (అహో. ౪౨౩ పుట) "తల్లిదండ్రియు నన్నుఁ గానక ఇత్యాది ప్రయోగ స్త్వనాకరత్వా దుపేక్ష్య ఏవ" అహో. ౨౮౫ పుట) "త్రిమూర్తి విలాస వర్తివిన్ ఇతి రూపం త్వసంగత మేవ" (అహో. ౨౩౭ పుట) ఈసందర్భమునుబట్టి "అనుజులకు నష్టపడి యేమిని జేయంగ నీకు" (ఉద్యో ౨ ఆ. ౧౩) "ప్రీతుఁ జేయుకం కొను హితమైన కృత్య మొకటిం గలదే" (ఉద్యో. ౩ ఆ. ౧౧౫) నున్నగు కవిబ్రహ్మ ప్రయోగములును నపప్రయోగములె యగుచున్నవి. (చూ. 'వ్యా. సం.' ౮౪ విష. ౩౦౯ పుట)

పైరీతి నహోబలపతి కర్థమే కాని యథర్వణ కారిక లింక ననేకములు గలవు. విస్తరభీతి నుదాహరింపలేను. కాన నహోబలపతి యథర్వణ కారికావళిని రచించి యథర్వణుని పేరు పెట్టె ననుట పట్టి కల్ల.

ఇంకఁ దిక్కనకుఁ బూర్వుఁడగు నథర్వణుని వికృతి గ్రంథమునకుఁ బూర్వ మనక తీరని యాంధ్రశబ్దచింతామణి చిరకాలమునుండి పండిత పరంపరాయాతమగు జనశ్రుతిచొప్పున భారతభాగాంధ్రీకర్తయగు నన్నయదే యనుటకు సందియ మున్నదా? కాదనుటకుఁ బ్రతిపక్షుల కేమి యుక్తి కలదో విద్వాంసులు పరిశీలింతురు గాక!

మఱియు నాంధ్రశబ్దచింతామణికిని నన్నయ రచించిన యాంధ్రమహాభారత భాగమునకును గల సంబంధము వాని యేకకర్తృకతను రూఢమూలము గావించుచున్నది.

I ఆంధ్రవ్యాకరణ ప్రపంచములో నొక్క యాంధ్రశబ్దచింతామణిమాత్రమె ప్రథమ పురుషక్రియల 'ఇ' కారమునకు స్వరపరకత్వమునఁ బరసవర్ణసంధి నిత్యతను విధించుచున్నది.

ఆంధ్రమహాకావ్య ప్రపంచములో నొక్క నన్నయ భారతభాగమున మాత్రమె ప్రథమ పురుష క్రియల 'ఇ' కార పరసవర్ణ సంధి నిత్యముగాఁ బ్రయోగింపఁబడినది. (చూ. 'వ్యా.సం.' ౮౧-౮౧ I విష.)

II ఆంధ్రవ్యాకరణ ప్రపంచములో నాంధ్రశబ్దచింతామణిని రచించిన నన్నయభట్టారకుఁడె యాపటు కుపేక్షింపఁబడుచున్న యర్థబిందువు స్థితిని స్థాపించెను. (చూ. ఈవిజ్ఞప్త్యనుబంధము viii పుట)

ఆంధ్రమహాకావ్యప్రపంచములో నొక్క నన్నయ భారతభాగమందు మాత్రమె ఖండాఖండ ప్రాస ముపయోగింపఁబడ లేదు. (చూ. శై. పా. ౩౩౧ ము. ౩౩౬ విష. అందును ౩౨౬. విష. ౩౦౪ ము. ౩౧౦ పుటలు. ఇంకను ౩౧౧ పుట)

III ఆంధ్రవ్యాకరణ ప్రపంచములో 'ర-ఱ'ల యతిప్రాస మైత్రి నుష్టమని నిర్ణయించినది యాంధ్రశబ్ద చింతామణి మాత్రమె.

ఆంధ్ర కావ్య ప్రపంచములో 'ర-ఱ' ల యతి ప్రాసమైత్రి నుపయోగింపనిది యొక్క నన్నయ భారత భాగము మాత్రమె. (శై. పా. ౪౪౪ విష.)

IV ఆంధ్రవ్యాకరణ ప్రపంచమున 'గోరు' మొదలగు శబ్దముల తుదిరేఫమునకు బహువచనమున ఱ=(ళ) త్వము నాదేశించియు "త్రాడు" మున్నగు శబ్దములతుది 'డ' కారమునకు 'ఱ' = (ళ) త్వ మాదేశింపని దొక్క యాంధ్రశబ్ద చింతామణి మాత్రమె.

నన్నయ భారత భాగమునఁ బ్రాసస్థలములం దట్టి 'ష' కారమునకు బ్రయోగము నొకట కున్నను నన్నయ కాలపు శాసనములలో "గుడి-(బహు) గుడ్లు" అను గీతి రూపములు కాన్పించుచున్నవి. ఇది శాసన ప్రయోగ ప్రదర్శన పూర్వకముగ నాంధ్ర వ్యాకరణసంహితా సరస్వమున వివరింపఁబడెను. (చూడుఁడు. 'వ్యా. సం.' ౧౯౫ విస. ౨౨౩-౭౩౮ పుటలు.)

V ఆంధ్రవ్యాకరణ ప్రపంచమున ద్రుతము కేవల నకార వ్యంజన రూపమని చెప్పినది యొక్క యాంధ్రశబ్ద చింతామణి మాత్రమే.

ఆంధ్రమహాకావ్య ప్రపంచమున నొక్క నన్నయ భారత భాగమందే ద్రుతము నకార వ్యంజన రూపముగా మాత్రమే ప్రయోగింపఁబడినది. (చూ. చిం-విష. పరి-౧-౨౫ విష. మొ. ౧౩౭ విష. ౫)

VI ఆంధ్ర వ్యాకరణ ప్రపంచమునందు వర్గయుక్తములగాని స్థిరములు పరమగునప్పుడును ద్రుతమునకు బిందువు విధించున దొక్క చింతామణి మాత్రమె.

ఒక్క నన్నయ భారత భాగమందు మాత్రమె నకార పరకత్వమున ద్రుతమునకుఁ బూర్ణబిందువు వచ్చు ప్రయోగములు గలవు. ఉదా: లయగ్రాహి, కమ్మని లతాంతములకుం మొనసి' (ఆది. ౫ అ. ౧౩౦ ప) (చూ. 'వ్యా.-సం.' ౭౧ I విస) (చూ. 'వ్యా. సం.' ౭౨ I విస)

VII ఆంధ్రవ్యాకరణ ప్రపంచమున ద్రుతప్రకృతిక హ్రస్వస్వర పరరూపసంధి నన్నయాథర్వణ పక్షమునందు మాత్రమె కనుపడును. ఇతరుల పక్షమున 'నాతున్+అనియె' అను నుదాహృతికే వీలు లేదు.

ఆంధ్రమహాకావ్యప్రపంచమున నకార వ్యంజనము మాత్రమె ద్రుతముగా ప్రయోగించు నన్నయభారత భాగమున మాత్రమె యట్టి పరరూపసంధి సందర్భపడును. ఇతరుల పక్షమున స్వరపరకత్వమున ద్రుతలోప మెట్లు?

VIII ఆంధ్రవ్యాకరణ ప్రపంచమున సమహా ద్విష్టయమున "యొక్క" కుఁ బర్యాయములుగా 'ది-వి' ప్రత్యయములను విధించునది యొక్క నన్నయాథర్వణీయమె.

ఆంధ్రమహాకావ్యప్రపంచమున సమహాద్విష్టయమున 'యొక్క-కు' బర్యాయములుగా, 'ది-వి' ప్రత్యయములను బ్రయోగించినది నన్నయభారత భాగము మాత్రమె (చూ. 'వ్యా-సం.' ౨౫౧ I విష)

IX "అను - కొను" మున్నగు 'ను' వర్ణాంతధాతువులు 'ట' ప్రత్యయాంతము లగునప్పుడు 'ను' వర్ణమునకు బిందు లోప పకారము సంభవింపదని సూత్రించున దొక్క నన్నయాథర్వణీయమె. "టవర్ణకః క్రియాన్తే స్యా ద్భావార్థే సానునాసయోః। స్ఫుటం హ్రస్వస్య న వికారో నోః।...(వికృతి వివేకము. క్రియా-౧౯ శ్లో) (వ్యా.సం. ౩౧౯ విస. ౧౮-౨౦ పుట) (వికృతి వివేకటీకాకర్త దీని నుదాహరించుట మఱచెను. (చూడుఁడు. ౧౪౫ ౯౯౯ పుట) (అంట మున్నగు బిందు ఘటిత రూపము నన్నయ భారత భాగమున నొక్కటేనియు లేదు. తిక్కన యట్టి రూపములను ధారాళముగఁ బ్రయోగించెను. ఉ: పాండు నృపాలు పాలు గైకొంటయ చాలు ... రా। కుంట ... (ఉద్యో-౩ఆ౫౯) (వ్యా-సం౧౮౩-౨పుట) మూల ఘటిక కేతన యట్టి సున్నను సూత్రించెను. క. తినుటకుఁ దింట యగున్ మఱిఁ। గొనుటకుఁ గొంట యగుఁ గనుటకుం గంట యగున్। వినుటకు వింట యగుం దా। ననుటకు నంట యగు వలసినప్పుడు కృతులన్ (ఆంధ్ర భాషా భూ. ౧౫౮ ప).

ఈసందర్భమునుబట్టి యథర్వణ కారికావళి తిక్కన కేతనలకు ముందటిదని తోఁచక మానదుగదా. దానికి మూలగ్రంథమగు చింతామణి నన్నయ రచిత మను పండిత జనశ్రుతి రూఢమూల మగుచున్నదిగదా.

X ఆంధ్ర వ్యాకరణ ప్రపంచమునఁ బదాది యకార మాచ్ఛిక శబ్దములందు గలదనియు, సంధివేళల లోపించుననియుఁ జెప్పిన దొక్క నన్నయాథర్వణీయమె. తక్కిన గ్రంథములెల్ల నట్టి పదాది యకారోచ్చారణము వ్యావహారికమనియు నద్దానిమీఁది యచ్చే యావయవిక మనియు వచించుచున్నవి. ప్రాచీనమగు, తమిళభాషలోఁ బదాది యకార మావయవికము గలదు. ఉదా: (తమి) యానై = (తె) యేనుఁగు (తమి) యాఱు = (తె) యేఱు. = (తమి) యారు =(తె) యెవరు - మొ.

ఈవిషయమును బరిశీలించునపు డాంధ్రశబ్ద చింతామణి యత్యంత ప్రాచీనమనియు దాని నర్వాచీన మనుట పరమసాహసమనియు నెవ్వరికేనిఁ దోఁచకపోదుగదా. ఆంధ్రశబ్ద చింతామణి నన్నయ భారత భాగముల కట్టి యాంతరంగిక సంబంధములు పెక్కు స్థలము లందు గలవు. విస్తరభీతిని వానినెల్లఁ జూపలేదు. ఈ సందర్భమునుబట్టి భారతాంధ్రీకర్తృ నన్నయాథర్వణులే యాంధ్ర శబ్ద చింతామణి వికృతి వివేక కారికల రచయితలని యెవ్వరికేని తోఁచకపోదుగదా.

ప్రతిపక్షుల నిస్సారములగు నితరాక్షేపణములకు నేనిందు సమాధానముల నియ్యఁ దలంపలేదు. దిఙ్మాత్రముగా నట్టివాని నొకటి రెండు చూపి విడుచుచున్నాను.

'వస్తున్నాడు, పోతున్నాడు' అను రీతిగల వ్యావహారికపదము, లసాధువులనియు 'వచ్చుచున్నాఁడు పోవుచున్నాఁడు' మున్నగు గ్రాంథిక శబ్దములు సాధువులనియు ననుశాసించుట నన్నయాథర్వణుల ప్రణాళికయే కాదు. గ్రాంథిక భాషలోని శబ్దములను నిరూపించుటయే వారిపద్ధతి. అట్లే "యితడు-యీతడు" మున్నగు వ్యావహారిక శబ్దముల యాది యకారము విషయమును వారు స్మరింపనేలేదు.

"అద్యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః" అను సూత్రము చెప్పినఁ (శై-పా- ౫౦౩ విష. ౫౭౭ పుట) (వ్యా. సం. ౫౩౩ విష. ౧౭౧ పుట) గొన్నిటఁ బదాది యకారము శబ్దావయవసిద్ధమే యని విశదీకరించుచున్న నన్నయకును నాతని గ్రంథమును వివరించుచున్న యథర్వణునకును నట్టి పదాది యకారములు హల్లులు కావనుట సమ్మతమని "అద్య+వర్ణాస్తు హ్రస్వేన । న గృహ్యన్తే కదాచన" అని యెవ్వరేని వ్యాఖ్య చేయుదురా? పరమ సాహసికులగు గోపాలకృష్ణయ్యగారు తప్ప. "అది+అవర్ణాస్తు హ్రస్వేన న గృహ్యన్తే కదాచన" (చూ. శై. పా. ౫౧౭ విష. ౫౩౪ పుట మొ.| 'వ్యా. సం' ౫౩౩విష. ౧౭౧ పుట మొ.) అని ఛేదముచేసి వ్యాఖ్యచేయుట యుక్తము కాదా. "ప్రాణా త్ప్రాణో లఘుర్యస్స్యాత్స హల్చాచ్చ క్వచిద్భవేత్" (శై. పా. ౫౧౭ విష. ౫౩౪ పుట) అని చెప్పిన యథర్వణుఁడు సంహితా 'అ' కారములోఁ గూడిన పదాది యకారము (వారియతడు) హల్లుకాదని చెప్పెనని వ్యాఖ్య చేయుట సమంజసముకదా! అట్టియెడ "శ్రీ వర్ఘులవారు అనర్థదాయకమైన విపరీతార్థంచేసి "అది+అవర్ణాస్తు" అని వ్యర్థమైన అర్థాన్ని చెప్పడం సమంజసం కాదు"

(ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారిక భాష ౧౫ పుట) అని నిరసనబుద్ధిచేఁగదా వ్రాయవలసెను.

"గ్రాంథిక వాదులైన శ్రీ వజ్ఝలవారు అసలు వ్యావహారిక వాదాన్నే కాదని త్రోసి పుచ్చుతున్నప్పుడు నా వ్యాకరణం బయటకు వస్తే వ్యావహారికానికి కూడా ఒక వ్యాకరణమా? అని అపహాసనము చేసి త్రోసిపుచ్చడం కష్టంకాదు" అని 'ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారికభాష' అనుదాని నానుడిలో శ్రీగోపాలకృష్ణయ్యగారు వ్రాసిరి. వ్యావహారిక భాషలో గ్రంథములను వ్రాయరాదని నేను వాదించువాఁడనుగాను. 'వస్తాడు పోతాడు' మొదలగు వ్యావహారికశబ్దములు ప్రాచీనమహాకావ్యములలోఁ గలవనుట సత్యవిదూరమనియే మాత్రమె నాయభిప్రాయము. ఏవో కొన్ని యుత్తరాంధ్ర గ్రంథములలో నలంటి వ్యావహారిక రూపములు లేఖకాది ప్రమాదములవల్లను, నట్టియుత్తరాంధ్ర సామాన్యకవుల సమ్మతివల్లను బ్రయుక్తములయినం గావచ్చును. ఆయా గ్రంథములను సరిగాఁ బరిశీలించినఁగాని యట్టివాని యథార్థము విశదముకాదు. అయినను వ్యావహారిక శబ్దాల ప్రయోగ ముత్తరాంధ్ర సామాన్యకవుల గ్రంథాలలో "కళాప్రపూర్ణ శ్రీ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు" చూపియే యున్నారు. ఆప్రయోగములనే మఱికొంత నిస్సారగ్రంథమును జేర్చి చూపుటలో వీరి యభిప్రాయమేమో తెలియరాకున్నది.

ఇంతకును నేను వ్యావహారికభాషలో సైతము గ్రంథములు వ్రాయవచ్చునని యీ వైయాకరణ పారిజాతము ౨౫ విషయమున స్పష్టముగా వ్రాసియే యున్నాను. వీరట్టి యసత్యపు వ్రాఁతలను వ్రాసి చేయు ఘనకార్యమేమో తెలియకున్నది. ఈరీతి నన్యాయముగాఁ గేవల నిరసన బుద్ధితో వ్రాసెడి వీరి వ్రాఁతలను విమర్శించుట యనావశ్యకము.

నన్నయభట్టారకుఁడు 'ర ఱ' ల యతిప్రాసమైత్రిని బ్రయోగింపఁలేదను సిద్ధాంతము చేతనేకదా "ఎఱుకని యెఱుఁగక, నీకున్ । మఱువ నెదిరితిని దీని మఱవుము నన్నుం । గఱకంఠా (టా) క్షమియింపుము..." (భార-ఆది ౧అ. ౩౨౬ ప) అను నన్నయ పద్యములో 'కఱ' అను దేశ్యశబ్దమె ప్రయుక్త మయ్యె నన వలసెను. లేనిచో నట 'గర' శబ్దమునే నిల్ప నగును గదా. అట్లె నన్నయ తద్భవములలో 'ఱ' కారమును బ్రయోగింపలేదను సిద్ధాంతము చేతనేకదా ప్రౌఢవ్యాకర్త సూత్రించినట్లుగ (ప్రౌఢ - సంజ్ఞా - ౯ సూ.) నట్టి పద్యమున "గరకంఠ శబ్దభవమగు 'కఱకంఠ' శబ్దము నంగీకరింపలేదు. నన్నయ ప్రయోగములం దెచ్చటను 'ర ఱ' మైత్రియుఁ దద్భవశకటమును లేవనియేకదా . యట్లంగీకరింపవలసెను. అట్లె 'కఱకంఠ' శబ్దగత 'ఠ' కారము ప్రాసగతముగ నెచ్చటను ప్రయుక్తము కాలేదు గాన నన్నయ 'కఱకంటా' అను శబ్దమును బ్రయోగించె నన దగును. ఇట్టి వ్రాఁత మిక్కిలి యసంభావ్య మనుచు నేమేమో నిస్సారపు యుక్తులను శ్రీ గోపాలకృష్ణయ్యగారు విస్తరించి వ్రాసిరి. (ఆం-భా-పీఠిక-౧౦౩-౧౦౪ పుటలు) తాటాకుల పుస్తకములు తప్పుల తిప్పలగుటచేతను, నట్టివి సంస్కరించిన వారును సామాన్యులగుటచేతను వానిని సంస్కరించుట యొక యకార్య కరణము కానేరదు. తాటాకుల పుస్తకములలోని వ్రాఁతలను యథాస్థితముగాఁ గవి ప్రయుక్తములని యెవ్వరును విశ్వసింపఁజాలరుగదా. కావున ముద్రణములలో 'కఱకంఠా' అని యుండుట యొక ప్రమాణము కానేరదు. నన్నయవంటి మహానుభావుఁడు ప్రయోగించినది గ్రామ్య మెట్లగును? దాని కనిష్ట్యగ్రామ్యతా కల్పనము వివేక

హీనతచేఁగదా కల్పింపవలయును. కావున నన్నయభట్టారకుఁడు "కలకంఠా" అని సాధు శబ్దమునే ప్రయోగించె ననుట కేవలము సమంజస మనుటలో విప్రతిపత్తి లేదు. (చూ-వ్యా-సం-౧౭౪-౧౭౫ పుటలు)

క. వాఁడి మయూఖము లనఁగా ।
వేఁడి పయోధరలనఁగ వింజామరనా
మూఁడస్త్రంబు లనంగాఁ
బోఁడిమి కలకంఠ నామముం బోలి తగున్ (అం-భూ-౧౩౪ ప.)

అను పద్యమున 'వాఁడి మయూఖములు' మున్నగునవి 'కలకంఠ' నామముం బోలి సాధువులగు నని కేతన చెప్పుచుండఁగా 'వాఁడి మయూఖములు' మున్నగునవి కర్మధారయము లనియు 'కలకంఠ' నామము బహువ్రీహి యనియు శ్రీగోపాల కృష్ణయ్యగారెట్లు వ్రాయ సాహసించిరో తెలియకున్నది.

"తా వృథా రమేశ సమా" (అం. భూ. పీఠిక. 64 పుట) అనువ్రాసిన శ్రీ గోపాలకృష్ణ గారి యపవ్యాఖ్యకు "సమాధానము లభింపనిం జేసి కాఁబోలు మిన్నకుండిరి." (అం. భూ. పీఠి ౬౭ పుట) అని వ్రాయుట యుక్తమా? ఇచటి సామ్యమునుబట్టి మాత్రము వలసినంత యర్థము వచ్చునఁట. ఇచటి సామ్యమునుబట్టి 'విధాతుఁడు' అనియు రూపసిద్ధి కల్గునని వీ రంగీకరింతురు కాఁబోలును!

కొన్ని వీరిజాబు లమాయికములనుకొని జవాబు లిచ్చితిని. పేరన్నగారి విద్యాభ్యాస మునవలె నంతకంతకుఁ బ్రశ్నములు హెచ్చినవి. నాకింత తీఱిక లేదని వ్రాసివ్రాసి విసిఁగి జవాబు లీయక మిన్నకున్న మాట నిజము.

కోడుగంటివారివీథి,
విజయనగరము
24—2—1956

ఇట్లు సుజనవిధేయుఁడు,

**వఝల చిన సీతారామస్వామి శాస్త్రి.**

# విషయసూచిక.

## I గ్రంథాదిసందర్భము.



విషయ సంఖ్య.

## II తద్భవప్రకరణము.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

౩౨౨. పైసూత్రమునకు బాలవ్యాకరణకర్త చేసిన వివరణము.

౩౨౩. ఈ యథర్వణ కారికలు సైతము ప్రక్రియోపయోగు లగుచున్నవి.

౩౨౪. హ్రస్వా త్పూర్ణో పీత్యాది చింతామణి సూత్రములును నఖండ ఇత్యాద్యథర్వణ కారికలును నుచ్చారణభ్రష్ట ఖండానుస్వార జ్ఞానమునకు సాధకము లగుచున్నవి.

౩౨౫. పూర్ణము ఖండముగఁ దేలుటలోని స్వాభావికత.

౩౨౬. ఆంధ్రభాషా సంస్కారమునాఁటి కర్ధానుస్వారోచ్చారణమును దీర్ఘపూర్వక పూర్ణానుస్వారోచ్చారణమును గొందఱ యుచ్చారణమున నుండెడ వనుటలో సందేహము లేదు.

౩౨౭. అర్ధానునాసికోచ్చారణము కాలక్రమమున నశించుటంజేసి కవులు సఖండ నిర్బిందుకస్థలములనుఁ బ్రాస ప్రయోగము నంగీకరించిరి. కాన, ఖండ పూర్ణరూపద్వయము నంగీకరించినట్లే నిర్బిందురూపాంతరమును నంగీకరించు టుచితము. కాని, లాక్షణికు లట్లు చేయక ఖండాఖండ ప్రాసము నంగీకరింపసాగిరి.

౩౨౮. అనంతుని ఖండాఖండప్రాసము సరిగ నుండలేదు.

౩౨౯. కూచిమంచి తిమ్మకవి దీర్ఘపూర్వకత్వమునందును హ్రస్వపూర్వకత్వమునందును ఖండాఖండప్రాసము నెల్లెడలను నంగీకరించి ప్రామాణిక ప్రయోగముల నుదాహరించెను.

౩౩౦. అప్పకవీయస్థ ఖండాఖండప్రాస సందర్భ విమర్శనము.

౩౩౧. అప్పకవీయోదాహృతులను గొన్నిటిని దిమ్మకవి యుపేక్షించుటలోని కారణములు. మూకశబ్దము నిర్బిందుకమనియే యప్పకవి యాశయము. అంకరము శబ్దము సార్ధ బిందుకము.

౩౩౨. ఒక్క నన్నయ భట్టారకుఁడు మాత్రమే ఖండాఖండ ప్రాసమును బ్రయోగింప లేదు. వీపుశబ్దము నిర్బిందుకము.

౩౩౩. తిక్కనాదులు ఖండాఖండప్రాసము నంగీకరించి వాడిరనుటచేత వారి ప్రయోగములు సఖండ నిర్బిందుక శబ్ద నిర్ణయవిషయమున సాకల్యముగఁ బ్రమాణములు కానేరవు.

౩౩౪. నన్నయ భారత భాగములోని యర్ధ బిందు ప్రాస ప్రయోగస్థలము లల్ప సంఖ్యాకములు.

౩౩౫. నన్నయభట్టు 'వీకు' అను నిర్బిందుక శబ్దమును బ్రయోగించిన స్థలములందు 'వీఁక' శబ్దమును నిల్పి యాతఁడును ఖండాఖండప్రాసమును బ్రయోగించెనని భ్రమింపరాదు.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

3౬౮. వర్గాక్షర పరకద్రుతము కాలక్రమమున ననుస్వారగ మగుచున్నది. అట్టి యను స్వార మర్థమాత్రిక నకారజన్యమై యైనను హ్రస్వపూర్వకత్వమున మాత్రిక మగుచున్నది.

3౬౯. అర్ధబిందు పరిణతి విశేషములు, బిందువు తేలుటలోని యుపపత్తులు, నుడి తొలియచ్చుమీఁది పూర్ణము తేలకుండుట కుపపత్తులు.

3౭౦. అవసానగత నమలు కొన్నియెడల లోపించుచునవి ద్వివియును బిందుపరిణతి ద్వారముననే లోపించుచున్న వనఁదగియున్నను, నాంధ్రు లట్టి బిందు పరిణామమును సూత్రింపలేదు. ప్రాకృతకర్ణాటములలో నట్టి బిందుపరిణతి మిక్కిలి విశాలముగ నున్నది.

3౭౧. సమాన పదమధ్యగ తానునాసికములు బిందువులై తేలుచుఁ గాలక్రమమున లోపించును. అట్టి యనునాసికములు ద్రావిడ భాషలలో నొక్కొక్కచాని యందు, నొక్కొక్క యవస్థలో నుండుట గుఱుగలదు. అట్టి శబ్దములపట్టిక

## V. అంతస్థ ప్రకరణము.

3౭౨. లఘువోఽలఘువ ఇత్యాది సూత్రవ్యాఖ్య.

3౭3. యవల లఘ్వలఘుతలను జూపుటను బాలసరస్వ త్యప్పకవులు "హలి సర్వేషా" మ్మను పాణినీయసూత్రమును జూపుట సరి కాదు. అహోబలపతిచూపిన "వ్యో ర్లఘు ప్రయత్నే" త్యాది సూత్ర మె సరియై యున్నది. అలఘుశబ్దము నకుఁ బర్యాయముగ నీవిషయమున గురుశబ్దమును వాడఁబడుచున్నది.

3౭౪. లకారద్వైవిధ్యము ప్రాకృతవ్యాకరణ ప్రసిద్ధము. అంతస్థములు నాల్గిటికిని లఘ్వలఘుభేద మాంధ్రమునఁ గలదని చింతామణి చెప్పుచున్నది.

3౭౫. స్వరసంహితలో నుచ్చారణ సౌకర్యార్థముగ వచ్చు యకారము లఘువని సంస్కృత ప్రాకృత వ్యాకరణానుసారముగఁ జింతామణియుఁ జెప్పు చున్నది.

3౭౬. లఘు వకార మిట్టి దని చింతామణి చెప్పలేదు. బాలసరస్వత్యాదులు ప్రథమమీఁది పకారమున కాదేశమగు వకారము లఘువని వ్యాఖ్య చేసిరి. అది సరి కాదు. యకార తుల్యన్యాయమున సంహితలో నాగమముగా వచ్చు వకారమె లఘువనుట యుక్తము. అట్టిది తెలుగున మిక్కిలి యరుదు. ఈ సందర్భమున నప్పకవీయములోని సందర్భ మసంగతముగ నున్నదని తత్ప్రతికా కర్తలు చెప్పుట సరి కాదు.

3౭౭. ర ల ళ, లఘ్వలఘుతలు యవల వంటివి కావు

3౭౮. అట్లయినను లఘ్వలఘు యవలకువలెనె ద్వివిధ లకారములకును యతిప్రాస మైత్రిని సంస్కృత పండిత మతానురోధమునఁ జింతామణి యంగీకరించు చున్నది.

విషయ సంఖ్య.

విషయ సూచిక.

విషయ సంఖ్య

విషయ సంఖ్య.

విషయ సంఖ్య.

విభాగము సంఖ్య.



## VI దంత్య తాలవ్య చజ ప్రకరణము.

విషయ సంఖ్య.

తత్సమములందు దంత్యల నంగీకరింపరాదు. స్వాభావికముగను దంత్య తాలవ్య-చజల మైత్రి విరుద్ధము కాదు.

౫-౨౫. ప్రాకృతే తత్స వేచాపీత్యాది కారికలోని ప్రాకృతశబ్ద మాంధ్రపరమ్యపరము. దానికి మహారాష్ట్ర్యాది ప్రాకృతపరముగా సహోదరులు చేసిన వ్యాఖ్యలు సరికావు. అధోక్షజ వచనార్థ విమర్శనము.

౫-౨౬. ప్రాకృతమునందలి చజలకు దంత్యోచ్చారణము గలదనుటకు ప్రమాణము లేదు. మరాఠీలో నిట్టి, దంత్య చజలు గలవను కాల్డువెల్లు దొరగారి వ్యాఖ్యల తెల్లువివరణము. మాగధిలోని చవర్గ స్పష్టోచ్చారణము వేఱువిధము.

౫-౨౭. ఇట్టి దంత్యతారూప సరళోచ్చారణ మితర ద్రావిడ భాషలందును గలదు. అట్లు లేదను కాల్డువెల్లుగారి యభిప్రాయము సరికాదు.

---

శ్రీరస్తు.

# నన్నయాథర్వణీయము.

## సంజ్ఞాపరిచ్ఛేదము.

### I గ్రంథాది సందర్భము.

ఆం-చిం॥ విశ్వశ్రేయః కావ్యమ్

---

# వైయాకరణపారిజాతము.

### I గ్రంథాది సందర్భము.

---

(౧ వి.) శ్లో॥ సుధియా పరిపూత మానసౌ
కలయేఽహం జగతః ప్రియంకరౌ ।
పితరౌ మమ వేఙ్కటామ్బికా ।
ముఖలిఙ్గేశ్వర జమ్పతీ హృది ॥

శ్లో॥ పితామహ భ్రాతృసుతం*స్వవిద్యా ।
గురుం చ చిన్తామణి సత్సమాఖ్యమ్ ।
శ్రీవత్స గోత్రోద్ధరణ ప్రశస్తిం ।
నమామి నారాయణ సత్కవీన్ద్రమ్ ॥

శ్లో॥ శబ్దశాసన నన్నార్య ।
మాన్ధ్రీకావ్య కృతాం గురుమ్ ।
వన్దే కవిత్రయగురుం ।
మాన్ధ్రీ వ్యాకృతి కృద్గురుమ్ ॥

---

* 'భ్రాతృజాయా' మ్మను మేఘసందేశప్రయోగముచేత భ్రాతృసుతశబ్దసమాసము సప్రమాణ మగుచున్నది.

మొదటిశ్లోకమున మాతాపితృపరముగాను పార్వతీపరమేశ్వరపరముగాను నర్థద్వయ మెన్నదగును. రెండవశ్లోకమున గురువులగు నారాయణపండితుల పక్షముగాను విష్ణుపక్షముగాను నర్థద్వయ మెన్నదగును. రెండిటను నుపమాధ్వనిని బరిశీలింపనగును.

శ్లో॥ తచ్చిన్తామణి శిష్టార్థం।
వ్యాచకారాన్ధ్ర లక్షణమ్।
యోఽస్మై ద్వితీయాచార్యాయ।
నమోఽథర్వణ సూరయే॥

శ్లో॥ నన్నయాథర్వణీయానాం।
సూత్రాణాం మూర్ధదర్శకౌ।
ప్రస్తౌమి తౌ బాలసర।
స్వత్యహో *బలపణ్డితౌ॥

(౨. వి.) శ్రీమచ్చళుక్య సామ్రాజ్య ధురంధరుండగు, రాజనరేంద్రుని యాస్థాన పండితుండును, శబ్దానుశాసనుండును నగు నన్నయభట్టారకుండు తద్రాజనరేంద్రప్రేరణమునఁ బంచమవేదమనంబరగు వ్యాసమహర్షి ప్రణీత సంస్కృత మహాభారతసంహిత నాంధ్రీకరింపఁబూని యీనాఁటి కాంధ్రభాష మహాకావ్యరచనోపయోగిభాషగా నేర్పడియుండమిఁ జేసియు, విశేషించి వివిధభావవిశాలంబగు మహాభారతసంహిత నాంధ్రీకరించుటకుఁ దగిన వైశాల్య మద్దానికి లేమింజేసియు, నానాఁటఁగల యాంధ్రదేశీయ పండిత వ్యవహారస్థ సంప్రదాయముచొప్పున నత్యంతవిస్తృత సంస్కృతభాషాశబ్దములకెల్లఁ దెలుఁగువిభక్తుల మేళగించుటచే నేర్పడునట్టి సంస్కృతపదముల సాహాయ్యమున నాంధ్రభాషకు మహావైశాల్యమును గల్పింపనెంచి తాదృశ సంస్కృత సమశబ్ద సాధన ప్రక్రియోపదేశము ప్రధానముగను, దక్కిన యుత్పత్స్యమా నాంధ్ర మహాకావ్యప్రయోగ వేద్యాచ్చాంధ్ర (తత్కాలోపదేశ యోగ్యవిషయము లల్పము లగుటంజేసి) భాషాస్వరూపనిరూపణ మప్రధానముగను, సూత్రింపనెంచి యీ యాంధ్రశబ్ద చింతామణిని రచించి శబ్దానుశాసనుండై యాంధ్ర మహాభారతము నాంధ్రీకరింపఁ దొడంగినవాఁ డయ్యెనని భారతాదిమ గ్రంథ విమర్శనమువలన విదితమగుచున్నది.

పయివిషయములెల్ల నా రచించిన చింతామణివిషయ పరిశోధన గ్రంథమున విపులముగఁ జర్చింపఁ బడియుండుటచే నిటనుండి విస్తరించి వ్రాయనయితిని. (చింతా 1-65 విష.)

(3. వి.) నన్నయభట్టారకునినాఁటి కొకటిరెండునందల సంవత్సరములకు ముందటినుండియుఁ దరువోజాక్కరాద్యాంధ్ర జాతిపద్యముల రచనము

* ('అహోబిల' మనియే పురాణపరిశీలనమువలనఁ దోఁచెడిని. అట్లయినను గవిశిరోభూషణ మాతృకలంచెల్ల "అహోబల" శబ్దమే యగపడుచున్నది. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వాదులలో నహోబలశబ్ద మంగీకరింపఁబడి యున్నది. ఇది సఞ్జ్ఞావాచకము. అహోబలకు 'ఓబల' అను వైకృతమును గవిప్రయుక్తము)

వెలయ నారంభించెననియు, నప్పటికే సంస్కృతశబ్దములకుఁ దెనుఁగు విభక్తులనుజేర్చిన సంస్కృత సమపదసముల నుపయోగించుకొనెడి యాచారము వెలసియుండెననియు, సరళాదేశ ద్రుతాగమ యడాగమాది సంధికార్యములు మున్నగునవి యప్పటి పద్యములలోనే వెలయ నారంభించెననియు, నావలికె సంస్కృతశ్లోకముల ననుసరించిన పద్యముల రచనము కన్నడమున వెలసియుండెననియు నట్టిసమయమున నిరర్గళ సంస్కృత కవితాధారగల నన్నయభట్టు తెనుఁగుపద్యములను రచించుట యసంభావ్యము కాదనియు, నట్టి యావలికున్న సంప్రదాయముల ననుసరించి నన్నయ భట్టారకుఁడు చింతామణి రచనముచేతను నాంధ్రభారత రచనముచేతను నాంధ్రభాష కుత్తమ వాఙ్మయవత్త్వావస్థను సంఘటించి వాగనుశాసనుఁడును నాంధ్రకవితా గురుండును నయ్యెననియు, నెఱుంగనగును.

క॥ వెలయంగఁ దెలుఁగు బాసకు।
దళమయ్యెను సీసములును దర్వోజలు గీ।
తులు నక్కఱలును ద్విపదలు।
పొలుపొందఁగ రేచఁడిష్టమున నొసరించున్॥
(కవిజనాశ్రయము. జాత్యధికారము ౧౦ ప.)

. . .

(క్రీస్తు. శ. ౮౪౮ A. D.)

పండరంగుని అద్దంకి శాసనము. శ. స. ౭౭౦ ప్రాంతము.

తరువోజ. పట్టంబుగట్టిన ప్రథమంబు నేణ్డు,
బలగర్వ్వమొప్పంగ బైలేచి సేన।
పట్టంబుగటి (ట్టి?) ఇచ్చ ప్రభుబణ్డరంగు,
బఞ్చినసమన్త (సామంత) పడువళ్తో బోయ।
కొట్టంబుల్పన్ద్రెణ్డుగొణి (ని) వేంగినాణ్డిం,
గొఱల్చి (గొఱచి?) యాత్రిభువనాంకుశబణ (బున?) నిల్పి।
కట్టెపు దుర్గంబు గడు బయల్సేసి,
కందు (దు) కూర్బెజవాడగా విఞ్చె మెచ్చి॥ ”

**(మ॥ రా॥ శ్రీ॥ జయంతి రామయ్యపంతులవారి శాసన పద్యమంజరి.)**

ఈ శాసనము నన్నయభట్టారకునకు రమారమి రెండువందల యేండ్ల క్రిందటిది.

## "యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము."

శ. స. ౮౨౦ ప్రాంతము.

(క్రీ. శ. A. D. 898.)

మధ్యాక్కరము :— స్వస్తి నృపాంకుశాత్య_స్త సత్యాల సత్యత్రినేత్ర,
వి_స్తర శ్రీయుద్ధమల్లుణ్డనవద్యవిఖ్యాతకీ_ర్తి ।
ప్రస్తుత రాజాశ్రయుణ్డు త్రిభువనాభరణుణ్డు సకల
వస్తుసమేతుణ్డు రాజ సల్కి-భూవల్లభుణ్డు కీర్తిన్. ॥
పరగగ బెజవాడ గొమరస్వామికి భక్తుణ్డై గుడియు
నిరుపమమతి నృపధాము ణ్డెత్తిచ్చి నెగిడిచ్చి మఠంబు,
గొరగల్గా కొంపలిన్దు విడిసి బృన్దంబు గొంటయుణ్డువాగ
... ... ...రిగాక యాభ్యారణాసి వచ్చిన పాపబు గొణ్డు,
వెలయంగ నియ్యొట్టు లిన్నినుటిన్నగ విడసనపొల,
గలతాన పతులును రాజు పట్టబుగట్టెన సతియు,
నలియంబయ్యారల నెల్వఅంచిన సర్వమేధంబు,
ఫలబు పేక్షించిన లింగబటెసిన పాపంబు దనుకు,
జననుత చేబ్రోలనుణ్డి బెజవాడ జాత్రకువచ్చి
త్రిణయను సుతుణ్డొణ్డు నోటు మెచ్చక తినిత్రి యున్నలన
యనఘుణ్డు సేకొని యున్న ప్రత్యక్షుబయ(యు?)న్న నిచ్చి,
గనిమల్లణ్డెత్తించె గుడియు మఠంబును గా_ర్తికేయునకు,
(దీని జేబ్రోలు ఖేలెడు (వా) రతిరబేలు (నా)రొణ్డు సాటిగొరగ,
లును బెట్టు వేరుగనుజ(ను) యా_స్థితి సేకొణి కాచు(వా)ర దీని,
న్దారునిల్పినవారు (స్థి)తిడప్ప యశ్వమేధ ఫలం(పం)బు గాన
రమనతో బెజవాడ కెల్ల బెడంగును రక్షయుంగాను
న్దమతాత మల్లపరాజు వేరెఱు బానుం గట్టించెం,
గ్రమంబునం దానికి కలశబిడ్డట్టుగా మొగమాడు
వమరంగ శ్రీయుద్ధమల్లు ణ్డెత్తించె నమిత తేజుణ్డు,
తనధర్మ్మునా వాడబడి కాచునృపతులకున్న.

(శాసన పద్యమంజరి. అనంపుర్ణ్ణి 2 శాసనము.)

పయి శాసనములభాష నన్నయ భారతభాషకుం జాల సన్నిహితముగనే యున్నదిగదా! (౨౭౦ విష. చూ.)

(క. వి.) కొందఱు విమర్శకులు నన్నయ భట్టారకుని కాలమునాఁటికిఁ దెలుఁగున, మలయాళమునందుఁ బ్రసిద్ధమైయున్న మణిప్రవాళరీతిగల కవిత యుండెడిదనియు, నన్నయభారతాంధ్రీకరణము నట్టిరీతితోనే నడుపవలయునని రాజనరేంద్రుని సభలో ఘోరయుద్ధములు జరిగెననియు నప్పుడు నన్నయ భట్టు కర్ణాట భాషాపండితుఁడగు నారాయణభట్టు సాహాయ్యము నందెనని యీక్రింది భారతపద్యము సూచించుచున్నదనియుఁ జెప్పుచున్నారు.

ఉ॥ పాయక పాకశాసనికి భారత ఘోరరణంబునందు నా ।
రాయణునట్లు వాసవనిభాంశమానసుల కీ విభూమిపునకున్ నా ।
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడును నుకృత్తుఁడునన్ సహా ।
ధ్యాయుఁడు నైన వాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగన్ ॥

(భార - ఆది - ౧ ఆ. ౨౬.)

మఱియు నిట్లు నారాయణభట్టు సాహాయ్యమునందిన నన్నయభట్టు కర్ణాటభాషాకవితారీతిని జూపియుఁ గర్ణాటభాషలో నట్టి మణిప్రవాళరీతి యప్పటికి నూటయేఁబదియేండ్ల క్రిందటనే నిరాకరింపఁ బడినదని నచ్చఁ జెప్పియు భారత రచనారీతిని స్థాపించెనని చెప్పుచుఁ దెనుఁగులో నట్టిమణిప్రవాళరీతి ప్రాచీనకాలమున గలదనుటకుఁ బాల్కురికి సోమనారాధ్యుని వృషాధిపశతకములోని యీ క్రిందిపద్యమును నిదర్శనముగఁ జూపుచున్నారు.

చ॥ అనయముఁ జేతులందు భవదంఘ్రిసరోజయుగం నమామి నె
మ్మనమున సంస్మరామి యనుమానములేక భజామి నమస్కరోమ్య హ
మ్మనుచు మణిప్రవాళమున నంకిత సేయుదు భక్తలోక హృ
ద్వనజవిహారలోల బసవా! బసవా! బసవా! వృషాధిపా "॥

కాని యిది యూహామాత్రమును సరికాదు.

వృషాధిపశతకములోఁ బాల్కురికి సోమనారాధ్యుఁ డీ సందర్భమున [illegible] తెలుఁగు సంస్కృత మణిప్రవాళరీతిని, సంస్కృత కర్ణాట పదమేళరీతిని, కేవల సంస్కృత పదగుంఫిత రీతిని వెండియు బహుభాషా పదగుంఫిత రీతిని ననుకారముచేసి ౫౦ పద్యము మొదలు ౬౮ పద్యమువఱకును బద్యరచనము చేసియున్నాఁడు. అట్టి రీతులెల్ల నాంధ్రమునఁ బ్రాచీనకాలమున నుండెనని నమ్మఁదగునా? గదా? (ఆ సందర్భములోని యీ పద్యములు మద్గ్రంథ [illegible] ముద్రింపఁబడియున్నవి.) సోమన కన్నడ మలయాళాదులలోని యట్టిరీతిని జమత్కరించి యుండును.

చ॥ "తిరువడినెమ్మనమ్మనను నే హృదయేశ్వర కిం పరీయుతాం
బరికరితంబు రాని నిను బాహిరిఁ బోలుట శాసితాహితా"
వరదనెగ్గల్లె యంచు నినుఁ బ్రస్తుతి సేయుదుఁ బెక్కు భాషలన్
వరద వివేకశీల బసవా! బసవా! బసవా! నృపాధిపా!॥

ఇంతయేల! నన్నయ భట్టారకుని నాఁటికి మహాకావ్యము లెవ్వియు లేకున్నను వెనుక వ్రాసిన రీతిగల కొన్ని శాసనపద్యములు నెలయుచున్నవి గదా! వానియం దెచ్చటను మచ్చునకైన మణిప్రవాళ రీతి యనఁగా సంస్కృతాంధ్ర విభక్త్యంత మేళితపదరచన గలదా? నానిరీతి చాలవఱకు నన్నయ భారత కవితరీతినే యున్నదిగదా!

పయి సందర్భమునుబట్టి యాంధ్రభాషలో నన్నయకాలమునకు నాఁటికి మణిప్రవాళరీతి యుండెననుటయు నాతఁడు "ఘోరరణంబు" నన్ప్రయుక్తాని నడఁగించెననుటయు నిరాధారము లగుటచే నెంతమాత్రమును విశ్వసనీయములు గానేరవు.

కాఁగా నన్నయభట్టు భారతము నాంధ్రీకరింపఁ బూనిననాఁటికిఁ దెలుఁగులోఁ గొంత సంస్కారము నందుట కర్హమగునట్టియు భారతకవితా రీతి కొంత గల్గినట్టియుఁ బద్యములే శాసనాదులలో నుండెడివనియు నట్టి శాసనములోని నియమములను నప్పటికిఁ బ్రాచీనులు, సమకాలికులును నగు పండితుల వ్యవహారములలోఁగల మఱికొన్ని నియమములను, ననుసరించి సంస్కృత శబ్దములను దెనుఁగులోనికిఁ దెచ్చుకొనెడి పద్ధతి నుపదేశించుటను బ్రధానముగాఁ జేసికొని నన్నయభట్టు చింతామణి రచనకుఁ గడంగెననియు నిశ్చయింపనగును. నేఁటి వ్యావహారికభాషను గ్రాంథికముగఁ జేయఁదలఁచు వారికిని నీపద్ధతి యావశ్యకమె యగుచున్నదిగదా! (౨౦ వి.) కాన నన్నయ భట్టు వ్యాకరణము మొదట రచించెననుట యసంభావ్యము కాదు.

(సూ. వి.) నన్నయభట్టారకుఁడు పయిరీతి నాంధ్రశబ్దచింతామణిని రచింపఁబూని తద్గ్రంథాదిని శిష్టాచార ప్రాప్తమగు మంగళమును విశ్వేత్యాది ప్రకృత సూత్రముతో నాచరించియున్నాఁడు.

విశ్వేత్యాది:—కావ్యమ్ = ప్రబంధము.

విశ్వశ్రేయః = సకలశుభములును గలది.

"శ్రేయస్, న. అతిశయేన ప్రశస్యమ్, ఈయసుః, ప్రాదేశః, ధర్మే మోక్షే, శుభేచ. (శబ్దస్తోమమహానిధి.)"

శుభములనఁగానిట సకల పురుషార్థములును ననిభావము. అయ్యవి ప్రవృత్తి నివృత్త్యుపదేశక కావ్యాధీనములగుటచేత సద్గాని సేవనమునలన లభించునని తాత్పర్యము.

ఇందలి విశ్వశబ్దము ప్రపంచవాచకమగుటచేతఁగాని, సాకల్యమును బోధించునదగుటచేతఁగాని, శివదేవతా వాచకమగుటచేతఁగాని మాంగళ్య సూచకము కానోపును. మఱియు, నామైకదేశగ్రహణన్యాయమున 'వి' శబ్దము విష్ణువాచకమగుటచేతఁగాని, యనూచానుల పండితుల డంగీకరించినట్లు గ్రంథాంత మంగళవాచక "విశేష" శబ్దాగమ యగుటచేతఁగాని యద్దానిచే మంగళాచరణము సమకూర్చఁబడెనని యెన్నఁదగును. లేదా సకలశుభములు గలదను నర్థముగల 'విశ్వశ్రేయ' శబ్దముచేతనే గ్రంథాది మంగళాచరణము సమకూర్చఁబడె ననఁదగును. ఇట్టిస్థితిలో సనూచానబలపతి, (చింతామణి) గ్రంథాంతమందు విశేషశబ్దముతోడను (వర్ణాగమో విశేషః) గ్రంథ మధ్యమున నచ్చటచ్చట నథశబ్దములతోడను మంగళ మాచరింపఁబడెననియు గ్రంథాదిని మంగళాచరణమునకు బదులుగా వర్ణగణాది (వర్ణగణాది శుద్ధియే యిందులేదు. చూ. ౭. విమ.) శుద్ధియేకాక వస్తునిర్దేశము సయితము చేయఁబడెననియు నీ క్రిందిరీతిని వ్రాయుటకుఁ గారణము తెలియకున్నది. "విశ్వశ్రేయః కావ్యమితి వస్తునిర్దేశోఽపి (వర్ణగణాదిశుద్ధియేకాక వస్తు నిర్దేశము సైతమునని యుప శబ్దార్థమచటి సందర్భమునుబట్టి విశదమగుచున్నది.) అత ఏవ దండి నోక్తమ్. "ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశోవాపి తన్ముఖమితి. నచ మఙ్గళం కావ్యమాత్రసాధారణమ్..............భగవతా పతఞ్జలినా మఙ్గళాదీని మఙ్గళమధ్యాని మఙ్గళాన్తాని శాస్త్రాణి ప్రథన్తే ఇత్యాద్యుక్త్యా ..............అతఏవా చార్యేణాపిమధ్యే మఙ్గళార్థత్వేన తత్ర తత్ర అథశబ్దః ప్రయుక్తః. అన్తే మఙ్గళార్థత్వేన విశేషశబ్దః ప్రయుక్త ఇతిజ్ఞేయమ్" (అహో. ౨౧ పుట.)

(౾. వి.) ఇందు గ్రంథాదినున్న 'విశ్వ' శబ్దమునకుఁగాని, 'వి' శబ్దమునకుఁగాని, గ్రంథాంతమందలి 'విశేష' శబ్దమునకుఁగాని మంగళ వాచకత్వము కోశాదులలో నగపడదు. మఱియు నవియు, నథశబ్దములును, నాయాచోట్ల నర్థాంతరములందుఁ బ్రయుక్తములై యున్నవి. వానికెట్లు మంగళార్థకత్వము పొసఁగును? "వక్రతమావథాప్యనుస్వారౌ, ఏజథోవక్రః, అథ లోపల కికురయోశ్చాన్త్యా, అథభూజ్యాదిః పరిణతిః, ఏకత్వేఽథ బహుత్వే

ముదుజా," అని యిట్లు చింతామణిలో వాడఁబడిన "అథ, అథో" అను శబ్దములు కొన్ని కోశములచొప్పున మంగళవాచకములయ్యు మంగళార్థమునఁ బ్రయుక్తములుగాక యానంతర్యాద్యర్థములందు వాడఁబడినవి. "ఏజథో వక్రః" అనుచోటవర్ణమే 'అథో' శబ్దమునకు "మధ్యే మఙ్గలార్థో వా" అని యశోబలపతి వ్యాఖ్య చేసియున్నాఁడు. ఇట్టి కారణములచే నయ్యవి యెల్ల మంగళవాచకము లెట్లగును?" అని శంకింపఁదగదు. ఆ శబ్దములు ఆయా స్థలములలో మంగళార్థమునఁ బ్రయుక్తములు గాకున్నను వానికి సహజ ముగానున్న మంగళార్థము వాని శ్రవణమాత్రమునను స్ఫురించునని లాక్షణికులు తలంచుచున్నారు. ఈ సంప్రదాయమునుబట్టి వృద్ధి, సిద్ధి మొదలుగాఁగలవానిని దెల్పు శబ్దములు గ్రంథాదిని మంగళార్థకములుగా వాడఁబడుట సిద్ధము కానేరదు.

మఱియు "మఙ్గలానన్తరారమ్భ ప్రశ్నకార్త్స్న్యేష్వథో అథ" అని యిట్లమరకోశమున "అథో అథ" శబ్దములు పఠితమై మంగళ వాచకత్వము చెప్పఁబడియున్నను ప్రామాణికులగు వాచస్పత్యకోశ కారులు కొంద అవి సహజముగా మంగళవాచకములు కావనియుఁ, బయి నుదాహరించిన యితర విశేషాది శబ్దములవలెనే వాని శ్రవణమునను గ్రం మున మాంగళ్యము స్ఫురించుననియు వ్రాసియున్నారు. "అథ......అనన్త ............మఙ్గళంతు నాస్యార్థః కింతు అర్థాన్తర ప్రయుక్తోఽప్యయం శ్రుత్యా మఙ్గళసాధనం భవతి.

శ్లో॥ ఓంకారశ్చాథశబ్దశ్చ ।
ద్వావేతౌ బ్రహ్మణః పురా ।
కణ్ఠం భిత్వా వినిర్యాతౌ ।
తేన మాఙ్గళికా వుభౌ ॥

ఇత్యుక్తేస్తస్య శ్రవణేన మఙ్గళసాధనత్వమ్. అతఏవ శారీరక భాష్యే - అర్థాన్తర ప్రయుక్తోఽప్యథశబ్దః శ్రుత్యా మఙ్గళ మారచయతీ త్యుక్తమ్............అథశబ్దానుశాసన మిత్యత్ర మఙ్గళార్థతమారోప దానమ్. అర్థస్తు అధికారఏవ........." (వాచస్పత్యకోశము)

"ఓమ్, అథ." అను శబ్దములు బ్రహ్మదేవుని కంఠమును భేదించుకొని నిరుపప్లవముగ బయటికి వచ్చినవిగాన నవి మంగళస్ఫోరకములు కానోపునని వారి యభిప్రాయమై యుండును. లీలగా సముద్రపానాదికమును జేసిన

